పండిత శ్రీ రామశర్మ ఆచార్య మాతా భగవతీ దేవిగార్ల సంరక్షణలో

# యుగసంధి ప్రబోధం

(యుగసృజేతల సింహనాదం)

సంపుటి : 4 ఫిబ్రవరి 99 సంచిక : 8



జగత్ జనని శ్రీ మహాయోగీశ్వరి దేవి

భారతదేశం తిరిగి జగద్గురు పీఠాన్ని అధిష్ఠించి తీరుతుంది.

# నివేదన

ఆత్మీయ సోదర సోదరీమణులారా .... చదవండి R.K. లెటర్‌ను కనీసం పది, పన్నెండు పర్యాయములు. చదివిన ప్రతిసారీ కనీసం దాని గురించి పది నిమిషాలు ఆలోచించండి. ................... యుగసంధి కాలము ఇంకా రోజులలో పూర్తి కావస్తుంది. మరి మనమేమో ఇంకా అహంకార పూరితులమై నిద్రాదేవి ఒడిలో ఊయలలూగుతున్నామని, గురుదేవులు శ్రీ R.K. గారు ఘర్జించుచూ వ్రాసిన ఆ పదాలు చూస్తుంటే.... ఏం ? ...... మీ రక్తం అవమానంతో ఉండుకుట లేదా ? గురుసత్తా ఆగ్రహానికి గురి అయ్యేలా వున్న మన ప్రవర్తన తలచుకుంటే సిగ్గుతో తలవాలిపోవటం లేదా ? ఎందుకింత దిగజారిన మానసిక స్థితిలో వుండాలి ?

లేవండి ....... జూలు విదిల్చి సింహనాదాలు చేస్తూ ముందుకురకండి. సంకుచితత్వం, అసూయ, ద్వేషం, అహంకారం వంటిదుర్గుణాల నొదలండి. స్నేహం, ప్రేమ, దయ, విశాల హృదయ స్పందనలతో ముందుకు రండి. మీరేం చేయగలరో వెంటనే R.K. కి వ్రాయండి.

ఇట్లు
మీ ఎడిటర్

జై మహాకాల్ - జై జై మహాకాల్

**యుగసంధి కాలపు అంతిమ దిన**

**కౌంట్ డౌన్ 306 రోజులు**

(మార్చి 1వ తేదికి)

# R. K. Letter



రైల్వే స్టేషన్, గుంటూరు.

ది. 24-2-99, 8-57 a.m.

ప్రియమైన **అపరిచితులైన** పరిచితులకు,

యుగసంధి సంవత్సరాల యొక్క చరమ బిందువుకు చేరుకున్నాము. అనేక ట్రస్టులు పెట్టాను. పుస్తకాల పబ్లికేషన్ తెలుగులో పెట్టాను. ప్రతీ కార్యక్రమాన్ని కొద్ది మంది వ్యక్తులకు బాధ్యతలుగా ఇవ్వబడినది. కాని చుట్టూ చేరిన వ్యక్తుల యొక్క అవగాహనా సామర్థ్యము ఎలా ఉన్నది అంటే - **మాష్టారు గారు ఇన్ని కార్యక్రమాలు చేపడితే ఎలా? ఒకే దాని మీద దృష్టి కేంద్రీకరింపక పోతే ఏదీ సాధించలేమని ఆయనికి తెలియదా** - (ఇంత మర్యాదగా వారి మాటలు ఉండవు, కాని అచ్చులో వారి మాటలు భావాలు యధాతథముగా వ్రాయలేము కదా !!!)

కొంత మంది వ్యక్తులకు ట్రస్టులు ఏర్పరచి ఒక విశేషమైన బాధ్యత అప్పచెప్పబడి నప్పుడు, తిరిగి మాష్టారుగారు మాకు చెప్పాలి అనే అద్భుత సమర్పణ చేసుకున్న వ్యక్తులు నాకు వద్దు. మిమ్మల్ని మీ అంతట మీరు ఒక ట్రస్టుగా ఏర్పడి వ్యక్తిగతంగా అత్యున్నత స్థాయి చేరుకోమంటే, జరిగింది మీకు విదితమే కదా ! కాని మీ అందరి సలహాలు నాకు నచ్చి సుకృతా నిలయములో వ్యక్తిగతంగా నా స్వంతమైన ట్రస్టును పెట్టుకున్నాను. ఇటువంటి పరిస్థితి

కల్పించిన ప్రత్యక్ష అప్రత్యక్ష మహనీయులందరికీ నా కృతజ్ఞతలు.

విభిన్న ట్రస్టులలో ఉన్నాము అనుకుంటూ పని చేయని వారికి మీరు ఇంత వరకు నా మాటలు ఏవిధంగా వినలేదో అలాగే దీనిని కూడ ఏ మాత్రం పట్టించుకోరని తెలిసినా ఒక ఉచిత సలహా - **ట్రస్టులో ఉండదలచుకుంటే పని చేయండి. పని చేయలేని నపుంసకులకు, అవసరవాదులకు బాధ్యత తీసుకొనలేని వారు ట్రస్టు నుంచి రిజైన్ చేసి సమర్థవంతులను బ్రతిమాలుకొని ట్రస్టు బాధ్యతలను నిర్వహించమని వేడుకోండి.** అలా చేయలేని పక్షంలో ఆ మహాకాలుడే చేయవలసింది చేస్తాడు. ఇది నా భవిష్యవాణిగా కూడ స్వీకరించవచ్చు. ఈ ఉత్తరాన్ని అవకాశముగా తీసుకొని పలాయనవాదులు పారిపోవచ్చు. సర్వ సమర్పణ నిజముగా **చేసుకొనగలిగే గురుసత్తా శిష్యులకు కర్తవ్యము వారికే బోధపడుతుంది.** "తస్మాత్ ఉత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృత నిశ్చయః" - మళ్ళీ గుర్తుంచుకోండి. **పిరికి వాళ్ళు, చేతకానివాళ్ళు నాకు దూరంగా ఉండండి.** చేతనైన వాళ్ళు నన్ను ఏమి అడగవద్దు. మీరు సొంతంగా ఎదగండి.

ఎవరైన, ఎప్పుడైనా నన్ను సృజనాత్మక క్రియాకలాపాలు చేపట్టదలచు కుంటే సలహాలు అడగవచ్చు. నా క్రింద పని చేయవద్దు. నాతో కలసి పని **చేయండి.** మీ సహకారాన్ని ఆశించే.

మీ

(శ్రీరామకృష్ణ)



# ఒకే విశ్వం నిర్మిస్తాను



ఈనాడు ప్రపంచము మూడవ ప్రపంచ యుద్ధము కొఱకు తయారవుతుంటే దానికి కారణము, కొన్ని వర్గముల శాసన ప్రవృత్తి. ఇది ఎప్పట్నుంచి మొదలయ్యింది అని చర్చించటము నిరర్ధకము. కాని జరుగుతున్నది ఏమిటీ అంటే సమర్ధ సమూహములు తమ ఆధీనములో భూమిని వుంచుకొని, అక్కడ వున్న దుర్భల వ్యక్తుల శోషణ ఆరంభించారు. క్లుప్తంగా ఇదే శాసన తంత్రము. పురాతన కాలము నుంచి ఈనాటి వరకు కొద్దిపాటి తేడాలతో ఇలాగే నడుస్తున్నది.

## ఆత్మ సమర్పణ

జపాన్ మీద వేసిన రెండు బాంబుల వల్ల, అది ఆత్మ సమర్పణ చేసుకొన్నందు వల్ల, శాసకులలో ఉత్సాహము ప్రబలి పైన చెప్పిన శాసనా విధానాన్ని అనుసరిస్తున్నారు. ఈ విధానము అమలులో వున్నంత వరకు యుద్ధాలు జరుగుతునే వుంటాయి. ఈనాడు ఇంతగా చింతిస్తున్నామంటే, అణ్వాయుధాల వల్ల చాలా తప్పించ గలిగినా ఇతర సాధనాలతో యుద్ధాలు జరుగుతునే వుంటాయి. దీనికి మూలకారణము సమర్ధ వర్గముల ద్వారా దుర్భల వర్గముల శోషణ. దీని ఆధారంగానే ఈనాడు దేశముల విభజన రేఖలు ఏర్పడ్డాయి. ఇలా జరిగియుండకపోతే దేశముల విభజన, భౌగోళిక వీటి ఆధారంగా జరిగి వుండేవి. అంతేకాక వెనకబడ్డ సముదాయానికి ప్రగతి సాధించిన సముదాయాలు చేయూతనిచ్చి వారిని ముందుకు తీసుకెళ్ళే తమ బాధ్యతను నిర్వహిస్తూ వుండి వుండేవారు. సమర్ధులెపుడూ తక్కువగానే వుంటారు. అసమర్ధులు అధికంగా వుంటారు. అందువల్ల ఎక్కువ మందికి మార్గదర్శనము, వారిని పరిష్కరించే బాధ్యత ప్రగతివంతులైన అల్ప

సంఖ్యాకులు చేయవలసి వస్తుంది. కాని ఇప్పటి పరిస్థితులు అలా ఎక్కడున్నాయి ? కొద్ది మంది ప్రతిభావంతులు తమ బుద్ధిబలము, సాధన బలము, జ్ఞానబలము, శాసన బలము వల్ల ఇష్టము వచ్చినంత స్థలాన్ని ఆక్రమించి దానిని తమది అంటున్నారు. ఇది అటవీ రాజ్యము అని అనిపించుకుంటుంది. బలవంతుడిదే రాజ్యమన్న యుక్తి చరితార్థమవుతుంది. ఈనాడున్న దేశముల విభజన, వాటిపైన కొన్ని సమూహాల అధిపత్యము, ఇవి ఈనాటి అనేక సంఘర్షణలకు మూల కారణం.

అణ్వాయుధాల ప్రయోగము చేయకపోయినా సమర్థుల ద్వారా దుర్బలుల శోషణ జరుగుతూ వున్నంత వరకు యుద్ధాలు అనివార్యం. ఎవరికి ఎంత బలముంటుందో వారు తమ కంటే క్రింది వారిని బెదిరించడం తన గుప్పెట్లో వుంచుకోవటం జరుగుతుంది. ఈ స్థితిలో అనేక మందిలో మహత్వాకాంక్షలు ప్రోదిచెంది వీలు చూచుకుని బహిర్గతమవుతాయి. సంస్థలు చీలిపోతుంటాయి.

సామంత యుగంలో ఇదే జరిగింది. ఎవ్వరి వద్ద ఎంత మంది ఎక్కువ బందిపోట్లు వుండేవారో అంతగా ఇతర రాజ్యాలను దోచుకునేవారు. తమ రాజ్యంలో కలుపుకునేవారు. ఈనాడు విధానాలు మారాయి. వెనుకటి వలె యుద్ధాలు బహిరంగంగా జరుగుటలేదు. యుద్ధాలం తాలుకు సిద్ధాంత వాదమనే ముసుగులు కప్పుతున్నారు. కానీ లధ్యములన్నీ ఒకటే. ఒక సమర్థ వర్గము ఏదో విధంగా ఇతరులను తమ ఆధీనంలో వుంచుకునే ప్రయత్నాలు కొనసాగిస్తునే ఉన్నారు.

## భూమి అందరిది

దేశపు టెల్లలు కొన్ని వేల సం॥ నుండి అలవాటుకి గురి అగుటచే స్వాభావికమనిపిస్తున్నాయి. ఎవరు ఎక్కడ అధికారం సంపాదించుకున్నారో అది వారి న్యాయోచిత అధికారం అన్పిస్తోంది. కాని నిజానికి ఔచిత్యము మరియు న్యాయాన్ని దృష్టియందుంచుకుంటే పరిస్థితి ఇంకోలా దర్శనమిస్తుంది. పృధ్వి మీద ఉత్పన్నమయ్యేవి. భూమి పుత్రులందరికి సమానంగా ఎక్కడ లభిస్తున్నాయి ? గర్విష్టులు తమ సుఖాలను స్వేచ్ఛగా

తగ్గించుకొని కనిష్టులకు ఎక్కువ సుఖాలనందివ్వటానికి ఎక్కడ ప్రయత్న శీలురౌతున్నారు ? ఇదే జరుగుతూ వుంటే వర్గ విభజన జరిగి విభిన్న క్షేత్రాల మధ్య అధికారం కొరకు పోట్లాట ఎందుకు జరుగుతుంది? భూమి అంతా అందరికి చెంది అందరూ సమానంగా లాభాన్ని పొందగల్గేవారు. దేశం పేరుతో విభజనలు ఉండేవి కావు. ఒక వేళ ఉన్నా దానికి కారణము. వర్గవాదముగాక, భౌగోళిక, రవాణా సౌకర్యం కోసం జరిగి ఉండేది.

**భూమి అంతా అందరికి చెంది అందరూ సమానంగా లాభాన్ని పొంద గల్గేవారు. దేశం పేరుతో విభజనలు ఉండేవి కావు. ఒక వేళ ఉన్నా దానికి కారణము. వర్గ వాదముగాక, భౌగోళిక, రవాణా సౌకర్యం కోసం జరిగి ఉండేది.**

ఖనిజ తైలం మధ్య ప్రాన్స్, అరబ్ దేశాలలో దొరుకుచున్నది. అందు వలన దానిపై అధిపత్యం వారికి మాత్రమే ఉంది. కాని భూమి అందరిదీ అగుటచే ఆ సంపదపై స్వామిత్వం అందరికీ చెందాలి. ఆఫ్రికా, అమెరికాలలో ఉపయోగించబడని ఖాళీ ప్రదేశాలు చాలా ఎక్కువగా ఉన్నాయి. చైనా, భారతదేశాల వంటి జన సంఖ్య ఎక్కువగా కల దేశాలలో తగినంత భూమి లేకపోవుటచే అనేక సమస్యలు ఏర్పడుతున్నాయి. ఈ విశ్వమంతా ఒక కుటుంబం అయినప్పుడు భూమి యావత్తు అందరికీ చెందాలి. భూమి నుండి జనించిన ఉత్పత్తి అంతటిలోను సమాన లాభాలు అందరూ పొందాలి. ఒక క్షేత్రంకు చెందినవారు తమ ఆధిపత్యాన్ని అచటగల ఉత్పాదనల మీద చూపించి దానిని తమ గుప్పెట్లో పెట్టుకొనుటకు ప్రయత్నిస్తూండటం వలన అవినీతికి బీజారోపణ గావించబడుతోంది. అవినీతి యొక్క చాలా పెద్ద లోయ ఏమంటే పెద్దవారు చిన్నవాళ్ళను మింగేస్తారు. ఈ మానసిక పరిస్థితి ఉన్నంత వరకు చిన్న, పెద్ద యుద్ధాలు జరుగుతూనే ఉంటాయి. దైవీశక్తులు వ్యక్తులను ''వెనుకకు మరలు'' అని ఏదో విధమైన రాజీకి కుదర్చడానికి ప్రయత్నిస్తాయి. కానీ ఇపుడు ముందుకు వస్తే జాగ్రత్త ! అనే ఉద్ఘోషణ ఇరువైపులా ఉచ్ఛైస్వరంలో వినిపిస్తోంది. ఇలాంటి పరిస్థితులలో తమ అస్థిత్వాన్ని పూర్తిగా కోల్పోకుండా

వుండాలనుకునే వారు ఇంగిత జ్ఞానాన్ని ఉపయోగించి ధైర్యంగా వెనుకకు మరల వచ్చును. ప్రస్తుత యుద్ధాన్ని నివారించవచ్చును. యుద్ధము సునిశ్చితంగా జరుగదు. అనే నా భవిష్యద్వాణి నిజమై తీరుతుంది. గురిపెట్టియున్న I.C.M.B. లు ఉపయోగించబడవు. కానీ దీని వల్ల ఏమవుతుంది ? యుద్ధము అంటే మందుగుండును మాత్రమే ఉపయోగించుట కాదు గదా ! నిజమైన యుద్ధము ఆర్థికమైనది. ఈ లోటు నేటి దేశ విభజన రేఖలున్నంత వరకు పూడ్చబడదు. రేపు కాకపోయినా ఎల్లుండైనా క్రొత్త స్వరూపాలు దాల్చి రకరకాల యుద్ధాలు జరుగుతూనే వుంటాయి. ఒక విధంగా నాశనం జరుగకపోతే వేరొక విధంగా నాశనం జరిగితీరుతుంది. మరి యుద్ధ విరామం వల్ల ఏమి సమాధానం పొందగలుతాము.

## ఒకే విశ్వ రాష్ట్రం ఏర్పడుతుంది

ఈనాడు సమస్యలన్నింటికీ జవాబు విడివిడిగా అప్పుడప్పుడు భాగాలుగా సమాధానలు కాకుండా ఒకేసారి లభిస్తుంది. అణుయుద్ధం ఆగిపోవడమేకాక వర్గాలు, రాజనీతిజ్ఞులు, తమ తమ సామర్థ్యానుసారం ఆక్రమించుకొన్న దేశ విభజన రేఖలన్నీ చెదరిపోతాయి.

**ఈనాడు ప్రపంచ పటంలో ఏ దేశం ఎక్కడ కనిపిసున్నదో అవేమీ అచ్చట కనబడవు. ఒక "విశ్వ రాష్ట్రము" నిర్ధారించబడి దానికి కావలసిన శాసన, పారిశ్రామిక, రవాణా సౌకర్యాలకు అవసరమయ్యే విభజన జరుగుతుంది.**

వినుటకు, ఆలోచించుటకు ఇది అసంభవంగా తోస్తుంది. అమెరికా తన ఆధీనంలో నున్న భూమిని ఎందుకు వదులుకుంటుంది ? రష్యా తన మిత్రమండలితో నున్న ఇంత మంది సభ్యులను ఎందుకు జార విడుచుకుంటుంది ? చైనా తన ఆధీనంలో ఉన్న క్షేత్రాన్ని మరల వర్గీకరించటానికి ఎందుకు ఒప్పుకుంటుంది ? చమురు ఉత్పాదన గావించే

దేశాలు ఇతరులకు వాటిలో ఎందుకు భాగం యిస్తాయి ? ఎవరు స్వేచ్ఛగా ఇందు కోసం ఒప్పుకోక పోవచ్చును. ముఖ్యంగా సమృద్ధిగా నున్న సమర్థ దేశాలు ధనహీనుల గోడును పట్టించుకోనే దెవ్వరు ? వారిపై విశ్వ పునర్విభజన చేసి వ్యవస్థీకరించడానికి ఒత్తిడినిగొని తెచ్చే సామర్థ్యమేది ? ఈనాటి పరిస్థితులలో పైన చెప్పిన పరివర్తన జరగడం అసంభవం అనిపిస్తుంది. కానీ మనిషి తన కాలంలో ఆలోచించిన భవిష్యత్తులో జరిగితీరాలని లేదు. దేశాల భౌగోళిక, ఆర్థిక, బౌద్ధిక స్థితులలో క్రిందటి సం॥లలో వచ్చిన మార్పును చూచి ఆశ్చర్యచకితులవ్వాల్సి వస్తుంది. మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత, రెండవ ప్రపంచ యుద్ధం దాని తరువాత రాబోయే మూడవ ప్రపంచ యుద్ధం మధ్యన వచ్చిన మార్పులు ఆర్థిక, రాజనీతిక దృష్టిలో చూస్తే అద్భుతం అయినవి. ఈ మార్పులు ఆనాటి వ్యక్తులకు చెప్పి వుంటే నమ్మి ఉండేవారు కాదు. హిట్లరు యొక్క ఉత్థాన, పతనాల మధ్య రోజులలో యూరోపులో వచ్చిన మార్పులు ఎవరూ ఊహించలేనట్టివి.

యుద్ధాల నిరాకరణ ఈసారి ఖచ్చితంగా జరిగి తీరుతుంది. అణ్వాయుధాలు, రసాయనిక మారణాయుధాలు ఉపయోగించకుండా ఉండుటను పరిస్థితులకు దైవీశక్తులు దిగి రావలసిన అవసరము లేదు. మనిషి యొక్క స్వంత తెలివితేటలు చాలును భగవంతుని జోక్యము వలన యుద్ధం ఆగిపోతే సరిపోదు. ఈనాడున్న దేశాలు ఎల్లల మాయమవ్వాలి. దానికి ఆధారభూత కారణాలు కూడ మటుమాయమవ్వాలి. రాబోయే కాలంలో భూమి రూపురేఖ అలాగే ఉన్నప్పటికీ దానిలో కనిపిస్తున్న అనేక చిన్న - పెద్ద దేశాలు వుండవు, కనిపించవు. "ఒకే విశ్వం - ఒకే రాష్ట్రం" అనే కల్పన ఎప్పటి నుండో ఉన్నది. ఈసారి అది ఖచ్చితంగా కార్యాన్వితమై తీరుతుంది. ఈనాడు సాధనాల పరంగా, జ్ఞానపరంగా, అనుభవ అత్యాశ దృష్టిపరంగా వెనుకబడినవారు అధిక సంఖ్యలో నున్నారు. సంపత్తి, బుద్ధి గలవారి సంఖ్య చాలా తక్కువ. పెద్దలు చిన్నవారి బాధ్యతలు తీసుకోవాలి. పెద్దలు అనుకుంటున్నవారు ఈ దృష్టిలో ఆలోచించటం మొదలు పెట్టాలి. సామర్థ్యపరంగా తక్కువ సంఖ్యాపరంగా ఎక్కువ ఉన్నవారి బాధ్యతలు కుటుంబంలో తీసుకున్నట్లు తీసుకోవాలి. వారి బలహీనతలను, వివశత్వముల

నుపయోగించుకొనుట అనే అలవాటు పడిన రీతిని పరిత్యజించాలి.

దైవీ కార్యాలను చమత్కారాలంటారు. ఘోర అంధకారంలో ఎక్కడి నుంచో వేడి గోళాన్ని ఆవిర్భవింప చేస్తారు. నిరంతరం చూస్తూ ఉండటం వల్ల అది ఒక గొప్ప విషయంగా అనిపించదు. చూస్తూ ఉండగానే ఆకాశం మేఘావృతమై వర్షించి పృధ్విని ముంచెత్తుతుంది. అంత ఆశ్చర్యకరం అయిన సర్వ నాశనానికి దారి తీసే యుద్ధ పరిస్థితులను మళ్ళించ గలిగితే దేశాల వర్తమాన ఎల్లలు ఎంత అస్వాభావికమో, అహితకరమో తెలుస్తుంది. పరిస్థితులలో మార్పు ఏ 'ముతాకి' పెద్ద మాంసపు ముద్ద వస్తుందో అనే ఆలోచనలో కాక, మనిషి ఈ భూమి మీద ఆనందంగా ఎక్కువ కాలం మన గలగటం ఎలా ? అనే ప్రయత్నాలు జరగాలి. నిరంతరం సమస్యల వలయంలో ఉండటం బదులు అందరూ ఒకసారి శాంత చిత్తులై దీర్ఘకాలిక నిశ్చయాలు తీసుకోవాలి. ఇక్కడ ఒకటి గుర్తుంచుకోవాలి. ఈసారి ఒక్కొక్క సమస్యకు వేరువేరు పరిష్కారాలు ఆలోచించకుండా అన్ని సమస్యలకు ఒకేసారి పరిష్కార మార్గం ఆలోచించాలి.

వ్యక్తి ఖండితంగా ఉండడు. ఒక జాతి, లింగ, వర్ణ గోడల మధ్య ఇరికించలేము. ఈ విధానంలో భూమి ఒక సముదాయం వల్ల ఆక్రమించబడి ఉండటం వల్ల అది వారిది అవదు. ఎంత నిర్ధారణల మీద ఆధారపడి ఉండము. చిర - పురాతమును చిర నూతనముగా మార్చవలె. భూమి ఏర్పడి మానవ ఉత్పత్తి జరిగినపుడు దేశము - జాతి అనే విభజన రేఖ లేదు. మనిషి తన వీలు, అవసరాన్ని బట్టి ఎక్కడికి అయినా వెళ్ళి రాగలిగే వాడు. జీవనోపయోగ పరిస్థితులు ఉన్న చోట స్థిరపడే వారు. మనిషి అలవాటును "కూడ తీసుకోవడం"ఏర్పాటు కాదు. అందువల్ల కుటుంబము, పేట, గ్రామలు ఏర్పాటు చేసుకొనుట మొదలెట్టాడు. కాని ఇప్పుడు ఏమి మార్పు వచ్చిందని కలసి పంచుకొని తినలేకపోతున్నారు ? ఎక్కువ కూడబెట్టిన వాడు ఇతరుల ఈర్ష్యకు లోనవుతున్నాడు. ఎక్కువ నష్టపోతాడు. ఎవరు ఎక్కువ కలవాడో, ధనవంతులో వారు పుణ్యాత్ములు. ఈశ్వర కృపకు పాత్రులు అనే నానుడి, భావన ఇంక వర్తించదు.

నిజంగా ఇది కష్ట సాధ్యమే. యుద్ధం ఆపడం కూడా కష్టమే. యుద్ధం

ఆపడం సంభవమనిపిస్తే ఆశృంఖలలోనే ప్రపంచం యొక్క క్రొత్త మ్యాప్ నూతన విధి విధానాన్ని కూడా కలుపుకోవాలి. ఇప్పుడున్న వ్యవస్థ జీర్ణ-శీర్ణమయి పోయింది. ఎంత బాగు చేయాలన్నా అతికించాలన్నా సాధ్యం కాదు. మొత్తం విధానంలోనే పరిపూర్ణ మార్పు చేయాలి.

## నేను భాధ్యత వహిస్తాను

శాసనాధ్యక్షులును యుద్ధాల గురించి ఆలోచించకుండా ఉండడానికి నేను బాద్యులను చేస్తాను. ముందు కేసిన అడుగులను వెనుకకు త్రిప్పమంటాను. కత్తులను తిరిగి ఒరలో పెట్టిస్తాను. అంతేగాక మనుషుల ద్వారా ఈనాటి విశ్వ సంహరణ అనుపయుక్తమని ఘోషణ చేయిస్తాను. చిర పురాతన వ్యవస్థ యొక్క చివరి క్షణాలు ఇవి. దానిని భూస్థాపితం చేసి ఈనాటి పరిస్థితులకు అనురూపమైన నూతన నిర్మాణం చూపెట్టాలి అని చెప్పిస్తాను.

**ఒకే ప్రపంచం, ఒకే రాష్ట్రం అనే మాన్యత. ఇప్పుడు ఒక సిద్ధాంతం మాత్రమే కాక వాస్తవ రూపం దాల్చుతుంది. దానికి తగిన రూపకల్పన జరిగి, సంపూర్ణ విశ్వమానవ ఏకత్వం ఏర్పడుతుంది. దీని కొరకు విశ్వ ఆలోచనా విధానంలో ఎంత తీవ్రమయిన మార్పులు వస్తాయంటే దానిని తలక్రిందులుగా నున్న దాన్ని త్రిప్పి సరిచేయుట అనవచ్చు.**

# ఈశ్వరారాధనకు గాయత్రీ మంత్రము



గాయత్రీ మంత్రము ఈశ్వరు నారాధించుటకు ముఖ్యసాధనమై యున్నది. ఇది జీవేశ్వరులు కలియుటకు ముఖ్యమార్గం.

గాయత్రీ మంత్రం :

ఓం భూర్భువ స్వః । తత్ సవితు ర్వరేణ్యం ।
భర్గోదేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్ ॥

ఇందున "ఓమ్" కారము పరమేశ్వరుని యొక్క నామములలో ఉత్తమమైనది. ఈ ఓమ్ - 'అ+ఉ+మ్' అను మూడక్షరములచే నేర్పడినది. ఈ మూడ అక్షరముల సముదాయమైన నామము నుండియే పరమేశ్వరుని యొక్క అనేక నామములలో కనిపించు చున్నవి.

ఈ 'ఓమ్' కారమును గూర్చి మహర్షి దయానంద సరస్వతి సత్యార్థ ప్రకాశమునం దిట్లు వివరించెను. "పరమేశ్వరునకు అనంత గుణకర్మ స్వభావము లున్నటులే అనేక నామములు నున్నవి. అందు ప్రతి గుణకర్మ స్వభావమున నొక్కొక్క నామమున్నది. ఆ నామములన్నింటిలో ఓంకారము సర్వోత్తమము".

'ఓమ్' యొక్క స్థూలార్థమును సాధారణ వ్యక్తి కూడా తెలిసుకొని ప్రతి క్షణము స్మరింపగలడు ఎట్లన. 'అ' నుచ్చరించుట వలన నోరు తెరువబడుచున్నది. ఇది పరమాత్మ యొక్క ప్రపంచ సృష్టిక్రియును సూచకము. 'ఉ' నుచ్చరించుట వలన నోరు విస్తరించుచున్నది. ఇది ప్రపంచం యొక్క విస్తృతికి - స్థితికి సూచకముగా నున్నది. 'మ్' నుచ్చరించుట వలన నోరు మూతపడుచున్నది. ఇది ప్రపంచవలయమునకు సూచకమగుచున్నది. ఇట్లు వర్ణత్రీయోచ్చారణతో సృష్టి స్థితిలయములకు సూచకమై ఓంకారము "జన్మాద్యస్యయతః" - అను వేదాంత దర్శన సూత్రార్థమును పరమాత్మ యొక్క జగత్ సృష్టి స్థితిలయ కర్తృత్వమును - ప్రకాశపఱచుచున్నది. ఓంకారము వినా పరమేశ్వరుని యొక్క యీ త్రిగుణములను - శక్తులను - ఒకే పర్యాయము ప్రకటించు నామమేదియు లేదు.

మహర్షి పతంజలి 'అవ-రక్షణే' ఇత్యర్థధాతువుతో 'అవతీతి ఓమ్' - ఇత్యాది + అర్థములు ఇరువది రెండు చెప్పెను. ఆయర్థములకు ధాతువులు నిర్మింపబడి వానికి పదములు సృష్టించుచో పరమాత్మ నామమెద్దియు నీ నామమునకు వెలుపల నుండ జాలదు. ఈ విధముగ భారతీయార్య సాహిత్యమునందీ 'ఓమ్' నామము సర్వోత్కృష్టముగ నెన్నబడుచున్నది. ఇంక సంగ్రహముగ మంత్రార్థము.

ఓమ్ = పరమాత్మ, భూః = (భూరితివై ప్రాణః) సర్వప్రపంచమునకు జీవనహేతువు, స్వప్రకాశ జ్ఞానస్వరూపడు, భువః = (భువరిత్యపానః) ముముక్షువులను, ముక్తులను, ధర్మాత్ములను సర్వ దుఃఖముల నుండి కాపాడువాడును, స్వః = (స్వరితి వ్యానః) సర్వ ప్రపంచమున వ్యాపించి సమస్తమును హద్దులలో నుంచువాడును సమస్తము నివసించుట కాధార భూతుడును, సుఖస్వరూపుడునునైయున్నాడు. సవితుః = చరాచర ప్రపంచమును నిర్మించి సకలైశ్వర్యముల నొసగువాడను, దేవస్య = సకలాత్మలను ప్రకాశపరుచువాడును, సకల సుఖములకు ప్రభువు - దాతయును నగు నతని యొక్క, వరేణ్యం = స్వీకరించుట కతి శ్రేష్ఠమైనదియు నర్హమైన దియునగు, భర్గః = ఆశుద్ధ విజ్ఞాన స్వరూపమును, ధీమహి = నిశ్చల భక్తితో మాయాత్మల యందు ధరింతుముగాక, యః = పూర్వోక్త సవితియగు నా పరమాత్మ, నః = మా యొక్క, ధియః = బుద్ధులను, ప్రచోదయాత్ = ప్రేరేపించును గాక, అనగా సకల దుష్టకార్యముల నుండి తొలగించి ఉత్తమ కార్యములందు మమ్ము సదా ప్రవృత్తపరచుగాక.

తా॥ మాకు సద్బుద్ధి నిచ్చు సత్కార్యము లాచరించునట్లు అనుగ్రహించుటకై సృష్టి స్థితిలయకారకుడు, సచ్చిదానంద స్వరూపుడు, సర్వ ప్రకాశకుడు నగు పరమాత్మ యొక్క శ్రేష్ఠమగు శుద్ధ విజ్ఞాన స్వరూపమును మేము సదా ధ్యానింతుము.

## అహంకార వర్జితం

లోక పరలోక కార్యములన్నింటికి నధిక కష్టములను కలుగజేయునది అహంకారము. దీనిని దూరమొనర్చుట అంత సులభముగాదు. అహంకారము

పెద్దవారి యొక్క పెద్ద రోగం. ఈ రోగం విద్వాంసులకు, ధనికులకు, బలవంతులకు, రాజులకు, మహారాజులకు, దైవభక్తులకును పుట్టుచుండును. మరియు దీనితోపాటు ప్రకృతి యొక్క చమత్కారం కూడా మానవుని సన్మార్గము నుండి తొలగించుటకు కారణమగుచున్నది. కావున మానవుడు పై విధముగ గాయత్రీ జపముతో కొంత కాలము పాటు ఈశ్వర స్తుతి ప్రార్థనోపాసన లొనర్చినచో అహంకారము తగ్గి వానిలో కొన్ని దైవీక శక్తులు మేలుకొనును.

మానవుడు సామాజిక, సహవాస, సత్సాంగత్యములచే ప్రభావితుడగు ప్రాణి. అతడు స్వయముగ నేమియు నేర్చుకొన జాలడు. కాని సహవాస, సత్సాంగత్య సంస్కారములు వానిలో కొంత మార్పును కలుగజేయగలవు. సహజంగా తెలియనివాడు తెలిసినవాని నాశ్రయించి తన యజ్ఞానమును తొలగించు కొనుచుండును. అట్లన్యు నాశ్రయించుటకు ముందు తనలో నహంకారమును చంపుకొనవలయును.

సంసారపు కొఱతలు దూరమైన తరువాత జిజ్ఞాస - సాధకుని - హృదయము నందే వికారము జనించుచున్నదో అయ్యదియే అహంకారము. ఈ అహంకారము జీవుని శుద్ధ మార్గమునందక అడ్డు గోడ వంటిది. దీనిని రూపుమాపనంత వరకు పరమాత్ముని సాయము లభ్యం కాదు. ఇంతే గాదు. స్తుతి ప్రార్థనోపాసనాదుల వలన లభ్యమైన శక్తులు కూడ నష్టమగును. కావున సాధకుడు తనలో అహంకారము జనింపకుండ చూచుకొనవలయును. జనించుచో రూపమాప వలయును. ఇదియే "ధియో యోనఃప్రచోదయాత్" అను మంత్ర భాగం సూచించుచున్నది. ఇందు మానవుడు సాధారణ బుద్ధిని త్యజించి మేధా ।ప్రజ్ఞా లేక ఋతుంభరా (సత్య) బుద్ధిని బడయుటకు ప్రార్థించుచున్నాడు. జీవితమును సఫలమొనర్చుటకై - జీవుడు పశుత్వం నుండి మానవత్వమును, మానత్వం నుండి దేవత్వమును బడయుటకై - అఖండనీయ మార్గమేదైన కలదనినచోనది ఉత్తమ బుద్ధిని బడయుటయే. ఏల యన ఆత్మోద్ధరణ కిదియే సర్వోత్తమమైన మార్గం మరియు నట్టి బుద్ధి జిజ్ఞాసు యొక్క సంశయముల నన్నింటిని దూరమొనర్చి ఆత్మ విశ్వాస సహాయంతో నట్టివాని నేదోయెుక గొప్ప అలౌకిక కార్యమున ప్రవేశ పెట్టగలుగుచున్నది.

బుద్ధి బలము వలననే మహర్షులు చక్రవర్తులను సైతము తమ ముందు చేతులు జోడించుకొని నిలబడునట్లు చేయగలిగిరి.

బుద్ధి బలము వలననే శ్రీ శంకరాచార్యులుగారు (ముప్పది రెండు సంవత్సరముల) చిన్న వయస్సులోనే భారత వర్షము నందు వ్యాపించియున్న నాస్తికత్వమును నిర్మూలింపగలిగెను.

బుద్ధి బలము వలననే మహర్షి దయానంద సరస్వతి అజ్ఞానాంధకారమును తొలగించి వేద సూర్యుని ప్రకాశ పరచి ధురంధరులయిన విద్వాంసులు చేయలేని కార్యములను చేయగలిగెను - సాధింపగలిగెను.

ఇంతయేల బుద్ధి బలము వలననే మానవుడు పులిని, మేకను, ఎద్దును ఒకే రేవులో నీళ్ళు త్రాగించగలుగుచున్నాడు.

కావున బుద్ధిని ఉత్తమముగ నొనర్చుటయన దానిని సూక్ష్మతమ విచారములను ధరించుటకు శక్తి శాలిగ నొనర్చుటయే. దాని వలన సూక్ష్మాతి సూక్ష, పరోక్ష, సృష్టికర్త యొక్క గుణకర్మ స్వభావములను దెలిసికొని వాని ననుభవము చేసికొననగును. కనుక దుష్టాహార, దుష్ట విచార, దుష్ట సాంగత్యములను నెమ్మది నెమ్మదిగా త్యజించి సత్సాంగత్య, స్వాధ్యాయముల వంకకు దృష్టిని మరల్చవలెను. దానితో బుద్ధి సూక్ష్మమై - సజీవమై - గాయత్రీ మంత్రానుష్ఠానము సఫలము కాగలదు.

ఇట్లు ఓమ్ - పదవాచ్యుడైన పరమాత్మను గాయత్రీ మంత్రముతో నుపాసించుట వలన సద్బుద్ధి లభింపగలదు. వేద ప్రతిపాదితమగు నీ పరమ పవిత్ర గాయత్రీ మంత్రములో సద్బుద్ధి నిమిత్తమే భగవంతుని ధ్యానం విధింపబడినది. మరియు సద్బుద్ధి ప్రాప్తికి గూడ నీ మంత్రము నందు ఉపాయము చెప్పబడుటయే కాక ఉపాస్య పరమాత్మ యొక్క స్వరూప వర్ణన గూడ స్పష్టముగ చేయబడినది. కావుననే గాయత్రి ఈశ్వరారాధనకు ముఖ్య సాధనముగా పేర్కొనబడినది.



# దేవుడు ప్రేమకు మాత్రమే చలిస్తాడు



సగటు మనిషి దేవుణ్ణి తన మనస్సుతోనే ప్రార్థిస్తాడు. కాని తన హృదయంలోని సంపూర్ణమయిన ఉత్సాహాతిశయంతో కాదు. ప్రతి స్పందన కలిగించడానికి ఇలాంటి ప్రార్థనలు పనికిరావు. పరమాత్మతో మనం, తండ్రితోనో, తల్లితోనో మాట్లాడుతున్న విధంగా విశ్వాసంతోనూ, చనువుతోనూ మాట్లాడాలి. దేవుడితో మన సంబంధం బేషరతు ప్రేమతో కూడి ఉండాలి. జగన్మాత రూపంలోని పరమాత్మను సమాధాన మిమ్మని ఒక హక్కుగాను, సహజంగాను గట్టిగా కోరవచ్చు. ఇతరులతో ఇది సాధ్యం కాదు. అలాంటి ప్రార్థనకు దేవుడు జవాబివ్వక తప్పదు. ఎంచేతంటే, తల్లికి - తన కొడుకు ఎంత పెద్ద పాపి అయినప్పటికి వాణ్ణి ప్రేమించడం, క్షమించటం ఆమెకు (సహజమయిన) మూలగుణం. ఈశ్వరుడు మనకిచ్చిన మానవప్రేమ తాలుకు అత్యంత కమనీయమయిన రూపం మాతాశిశు సంబంధం.

దేవుణ్ణి గురించి నిశ్చితమయిన ఒక భావన (జగన్మాత వంటిది) అవసరం లేకపోతే పొందలేము. అంతే కాకుండా ఈశ్వరుని సమాధానం కోసం మన అభ్యర్థన బలంగా ఉండాలి. సగం సగం నమ్మకంతో చేసే ప్రార్థన స్పష్టమయిన సమాధానం సరిపోదు. "ఆయన నాతో మాట్లాడతాడు" అని మీ మనస్సులో నిశ్చయించుకొన్నట్లయితే, ఎన్నేళ్ళు అయన మీకు సమాధానం ఇవ్వకపోయినా, మరోలా నమ్మడానికి నిరాకరించి నట్లయితే, ఆయన్ని నమ్ముతూనే ఉన్నట్లయితే, ఒకనాడు ఆయన మీకు సమాధానమిస్తాడు.

## నేను దేవుడితో మాట్లాడిన సందర్భం

నేను దేవుడితో మాట్లాడిన అనేక సందర్భాల్లో కొన్నిటిని గురించి 'ఒక యోగి ఆత్మ కథలో రాశాను. దైవవాణిని వినే మొదటి అనుభవం నేను చిన్న పిల్లవాడిగా ఉన్నప్పుడే కలిగింది. ఒకనాడు ఉదయం నేను పక్క మీద కూర్చుని స్వాప్నిక చింతనలో మునిగిపోయాను.

"కళ్లు మూసుకొని ఉన్నప్పుడేండే చీకటికి వెనకాల ఉన్నది ఏమిటి ? అంటూ లోతులు తరిచే ఈ ఆలోచన నా మనస్సులోకి బలంగా చొరబడింది. తక్షణమే నా అంతర్దృష్టిలో బ్రహ్మాండమైన మెరుపు లాంటి వెలుగు ఒకటి కనిపించింది. కొండ గుహల్లో ధ్యాన ముద్రలో కూర్చుని ఉన్న మునుల దివ్య దేహాలు నా నుదుటికి లోతట్టునున్న పెద్ద వెలుతురు తెర మీద చిన్న సైజు సినిమా బొమ్మల్లా రూపు గట్టాయి.

"ఎవరు మీరు ?" అంటూ బిగ్గరగా అడిగాను.

"హిమాలయ యోగులం", అన్నారు ఆ దివ్యరుషులు. వారి దివ్యమయిన సమాధానాన్ని వర్ణించటం కష్టం. నా గుండె ఝల్లుమన్నది.

అంతర్దర్శనం అదృశ్యమయింది. కాని తళతళలాడే కిరణాలు వలయాలు వలయాలుగా అనంతంగా పెరిగిపోతున్నాయి.

" అద్భుతమయిన ఈ వెలుతురు ఏమిటి ? అన్నాను.

"నేను ఈశ్వరుణ్ణి. నేను వెలుతురును", మేఘాల ఉరుముల్లా వినిపించింది స్వరం నాకీ తొలుతటి అనుభవం కలిగినప్పుడు మా అమ్మా, మా పెద్దక్క రమా దగ్గరలోనే ఉన్నారు. దివ్యవాణిని వాళ్ళూ విన్నారు. నేను సంపూర్ణంగా ఆయనలో ఐక్యమయే వరకు ఆయన్ని అన్వేషించాలని అక్కడికక్కడ, అప్పటికప్పుడు నిర్ధారణ చేసుకునేంతటి ఆనందం దేవుడి సమాధానం వల్ల నాకు కలిగింది.

చాలా మంది, మూసుకొన్న కళ్ళకు వెనుక చీకటే ఉంటుందని అనుకుంటూంటారు. కాని, మీరు అధ్యాత్మికంగా పెరుగుతున్న కొద్దీ నుదుటలో ఉన్న "ఒంటి" కన్న మీద మనస్సు నిలిపిన కొద్దీ మీకు లోచూపు వస్తున్నట్లు తెలుసుకుంటారు. అనేక కాంతులు మహత్తర సౌందర్యము గల మరో లోకాన్ని మీరు దర్శిస్తారు. నాకు కలిగిన హిమాలయ యోగుల అంతర్దర్శనం మాదిరి, సాధువుల అంతరదర్శనాలు మీకు కూడా కలుగుతాయి. మీ ఏకాగ్రత ఇంకా గాఢమయితే మీరు దైవవాణిని వినగలరు.

**పవిత్ర గ్రంధాలు :**

ఈశ్వరుడు మనతో సంభాషిస్తానని చేసిన వాగ్దానాన్ని పవిత్ర గ్రంధాలు పదేపదే చెబుతున్నాయి. "నువ్వు నిండు గుండెతో నా కోసం చింతన చేస్తే,

నా కోసం వెతికితేనన్ను తెలుసుకుంటావు" - జెరమిచు 29:13 "నువ్వు ఈశ్వరుడితో ఉన్నప్పుడు, ఈశ్వరుడు నీతోనే ఉంటాడు. నువ్వు అన్వేషిస్తే నీకు కనిపిస్తాడు", నువ్వు ఆయన్ని విడిచిపెడితే ఆయన నిన్ను విడిచిపెడతాడు" - 11 క్రానికల్స్ 15:2, "ఇదుగో, నేను తలుపు దగ్గర నిలబడితడతాను, ఎవరయినా నా పిలుపు విని తలుపు తెరిస్తే, నేను అతని దగ్గరికి వస్తాను. అతనితో తింటాను, అతను నాతోనూ" - రివలేషన్ 3:20.

ఒక్కసారి కనుక మీరు ఆయనతో కలసి "భుజిస్తే" ఆయన మౌనానికి భంగం కలిగిస్తే, ఆయన మీతో తరచుగా మాట్లాడుతూ ఉంటాడు. కాని మొదట్లో ఇది చాలా కష్టం. దేవుడికి పరిచయస్తుడు కావడం సులువు కాదు. ఎంచేతంటే, మీరు నిజంగా ఆయన్ని తెలుసుకోవాలనే కోరుతున్నారన్న సంగతి ఆయనకి రూఢీ కావాలి. భక్తుడికి నిజంగా తానే కావాలో మరొకటేదయినా కావాలో చూడటానికి ఆయన పరీక్షలు పెడుతుంటాడు. మీ హృదయంలో మరో కోరిక ఏదీ నక్కి ఉండలేదన్న నమ్మకం ఆయనకి కలిగేదాకా మీతో మాట్లాడడు. ఆయనిచ్చే కానుకల కోసమే కోరికలతో మీ హృదయం నిండి ఉన్నప్పుడు ఆయన మీకెందుకు వెల్లడి కావాలి ?

అందుకని ఆ పరమాత్మని కోరికలులేని స్థితిలో 'అమ్మతో ఎంత ప్రేమతో, ఆర్తితో మాట్లాడతారో అలాగే మాట్లాడండి. తప్పక ఫలితం సాధిస్తారు.

## ఆధ్యాత్మిక ధూమము - ధార్మిక పవిత్ర పొగ

హిందువులు దేవాలయములందు, యజ్ఞము, యాగము, హోమము, దీపారాధన, మంగళ హారతి, దీపోత్సవము, దీపావళి రోజున కాల్చు బాణా సంచా మొదలగునవి. యజ్ఞయాగాదుల అనుష్ఠానము మన హిందూ దేశము నందు ప్రాచీనకాలము నుంచి సత్ సాంప్రదాయముగా అనూచానంగా వస్తూనేయున్నది. దశరధుని పుత్ర కామేష్ఠి యాగము, దక్షప్రజాపతిచే సత్రయాగము, ధర్మరాజుచే రాజసూయ యాగము, ఇత్యాదులైన పౌరాణిక యాజ్ఞయాగాదులను మనము వినుచున్నాము. గృహస్థ బ్రాహ్మణులు దైనందిన వైశ్యదేవ అగ్ని కార్యము, నవగ్రహ హోమము, ధన్వంతరి హోమము, సహస్ర

చండీ యాగ హోమాదులు ఆస్తికుల ఆచరణీయములైనవి. అష్టగ్రహ కూటమితో భారతదేశములో అన్ని ప్రదేశములలో ప్రజలు భయభీతులై చాలా విధాలుగా యజ్ఞయాగాదులు, దేశ హితమునకై చేయించినది అందరికి తెలిసినదే, పారమార్థిక దృష్టితో ఈ యజ్ఞయాగాదులచే ఫలముండునా - లేదు అను వివాదాస్పద విషయమును గమనించి, వైజ్ఞానికముగా ఈ యజ్ఞయాగాదులచే కలుగు ప్రయోజనములను వివరించ దలచినాను. శ్రీ కృష్ణుడు భగవత్ గీత యందు అనేక విధములుగా యజ్ఞములను వివరించినారు. ద్రవ్యయజ్ఞా, స్తపో యజ్ఞా, యోగయజ్ఞా, స్తథాపరే, స్వాద్యాయ జానయాజ్ఞాశ్చ, యతయస్సంశిత వ్రతా॥ "అనగా **కొందరు ద్రవ్య రూపమయిన యాగమునూ, కొందరు వ్రతరూపమయిన తపో యజ్ఞమునూ, కొందరు ప్రాణాయామమైన యోగ యజ్ఞమునూ, కొందరు వేదాభ్యాసమైన స్వాధ్యాయ యజ్ఞమును చేయుచున్నారు.** కాళిదాసు రఘువంశము నందు, దిలీప చక్రవర్తి యజ్ఞయాగములను ఆచరించి ఇంద్రుని ప్రసన్నుని చేసికొనెను ఇంద్రుడు యజ్ఞయాగాలకు సంతృప్తిని పొంది, వర్షములు, పంటలు సమృద్ధిగా కలుగునట్లు అనుగ్రహించెననియు - ఇట్లు స్వర్గమర్త్య లోకములు రెండును సుఖశాంతులు వెలసినట్లు వర్ణింపబడియున్నది.

యజ్ఞ - యాగ - హోమములందు పవిత్ర మంత్రముల ప్రభావముచే దేవతలు తృప్తి చెందుదురు అను అధ్యాత్మిక భావనయున్నది. ఈ విషయమై వాదవివాద ప్రమేయము లట్లుండనీ, యజ్ఞయాగాదులలో అగ్ని యందు వేసి కాల్చు ఆహుతుల విషయమై చూతము, అశ్వత్థ, మోదుగ, ఉత్తరేణి, జిల్లేడు, గరిక, జమ్మి, దర్భ, అన్నము, పాయసము, నెయ్యి, కలకండ, ఖర్జూరము, టెంకాయ, పసుపు, తెల్లఆవాలు, లవంగాలు, ఏలకులు, జాజికాయ, బాదామి మొదలగు ద్రవ్యములన్నియు వేసి కాల్చునపుడు, వెలువడు హోమ ధూమము అన్నింటికి క్రిమి నాశకము మరియు క్షయ, శ్వాసకోశ, దగ్గు, అపస్మారము, బాలగ్రహాది అనేక రోగములను గుణపరచు విశేషశక్తి యున్నదను నది శాస్త్రసిద్ధము మరియు వైజ్ఞానికము అనునది నిరూపించపబడినది.

(ఒకమాటలో సుభాషిత కారుడు ధూమము, పొగ) ను రెండు భాగములు చేసి వాటి గుణములను వివరించినాడు.

శ్లో॥ వృద్ధార్కో హోమధూమశ్చ, బాలస్త్రీ నిర్మలోదకమ్ ।
రాత్రే క్షీరాన్న భుక్తిశ్చ, అయుర్వృద్ధిః దినే దినే ॥
బాలర్కాః ప్రేతధూమశ్చ, వృద్ధస్త్రీ పల్వలోదకం ।
రాత్రే దధ్యన్న భుక్తశ్చ అయుక్షీణం దినే దినే ॥

ఇప్పుడు మనకు ఏ ధూమపానము చేయవలెను అనుదాని విషయము అర్థమగును. దేహారోగ్యానికి హానికారక పొగను విడిచి, మిగిలిన వాటి ధూమపానమును చేసి ఆయుష్షు, ఆరోగ్యమును నిలుపుకొని, పెంచుకొని వృద్ధి చేసుకోవలయునని తెలియుచున్నది.

**హోమము నందు నెయ్యి మొదలగు హోమ ద్రవ్యములు వేసి కాల్చునపుడు ఉత్పాదించు సుగంధ పూరితమైన ధూమము, క్షయ, శ్వాసకోశము మొదలగు వాటిని ముక్కు రంధ్రముల మూలకముగా శ్వాసకోశము - హృదయములను చేరి అందు నుంచి రక్తమును చేరి సూక్ష్మ రోగాణువులకు మారకమగును** అని పాశ్చాత్య విజ్ఞానులనేకులు Hapekin of France, Dr. Totalit of Italy, Lit work of France మొదలగువారు తమ పరిశోధనలచే స్థిరపరచినారు.

విజ్ఞాన సిద్ధాంతానుసారము, వస్తువునకు రూపము బదలాయించుటచే అది వికారము చెందవచ్చును గాని నాశనము కాదు. (When a candle is burnt nothing is lost) హోమ ద్రవ్యములను కాల్చినపుడు వాటి సూక్ష్మకణములు, తైలాంశము ధూమరూపములో బయలుదేరి, వాయువులలో కలిసి, ఉచ్ఛ్వాస మూలకముగా పుప్పుసములకు చేరి అక్కడ యుండు క్షయపు రంధ్రమును (Cavity) పూరించును. యాక్స్‌రే (X-Ray) మూలకముగా దీనిని పరీక్షించవచ్చును. ఈ ధూమకణముల వ్యాసము 1/10,00,000 సెం. మీటరంత సూక్ష్మవ్యాసమును కలిగియుండును. మరియొక విజ్ఞాన సిద్ధాంతరీత్యా, స్థూల రూపముగా యున్న ద్రవ్యమునకన్నా, దాని సూక్ష్మరూపము నందు అధిక శక్తియున్నది (Atom Bomb) యాటంబాంబు దీనికి సాక్షి. ఈ సిద్ధాంత మూలకముగానే ఆయుర్వేద ఔషధములను పుటముపెట్టి, అతిగా మర్ధించుట అనునది అనుభవములో యున్నది. హోమియోపతి వైద్య విధానము నందు పొటెన్సీ సిద్ధాంతము కూడ ఇందు

కొరకే, వీటిని గమనించిన, అగ్ని యందు వేసి కాల్చిననే తప్ప, ఇంకే విధముగాను ఔషధి పరమాణువులు, అత్యంత సూక్ష్మ రూపమును పొందజాలవు. మిరియాలు, మిరపకాయలు, ఇంగువ మొదలగు తేజో ద్రవ్యములను పొయ్యిలో వేసి కాల్చిన అక్కడయుండు జనులందరూ దగ్గుదురు. ఇంగువ కణపు పరిమళము అక్కడ యుండు నూరారు జనుల ముక్కులకు చొరబడును, జపాన్, చైనాల యందు హోమమును "ఘెమ" అను పేరుతో ఆచరింతురు. దేవాలయము లందు ధూపము, గంధరూపములో నిప్పులపై వేసి పొగనుత్పాదింతారు. ముసల్మానులు కూడ మసీదులందు పండుగల సందర్భములోను ధూపము వేయుట ఆచారముగా యున్నది. వీటన్నింటిని గుర్తించిన మన ప్రాచీన మహర్షులు యజ్ఞ, యాగ హోమాది విధానములను ధార్మికము పేరుతో విధాయకము గావించినారు. ప్రజలు ఆరోగ్యరక్షణమునకై, జనులు ఎక్కువగా చేరు ప్రదేశము లందు ఖార్కానాదులు మొదలగు కలుషిత వాతావరణమున్న స్థలములలో ఇటువంటివి తప్పనిసరిగా ఆచరించవలయును.

ఈ విషయమును బాగుగా పరిశీలించిన వీటి పాత్ర ఎంత ప్రాముఖ్యమనునది తెలియగలదు. ఈ విద్య యందు ఇంకనూ మరి కొన్ని పరిశోధనలు సలిపిన, ఇప్పుడు అనవసరముగా వ్యయమగుచున్న ఔషధముల కోట్లాది రూపాయలు ఖర్చులు మిగుల్చుటయే గాక, ప్రజలు ఆరోగ్యవంతులై జీవించగలరు.

ఇప్పుడిప్పుడే "హరేకృష్ణ" పథమునకు చేరిన విదేశీయులు కూడ దీని మహాత్వమును తెలిసి "Fire Sacri Fice" అను పేరుతో హోమాదులను శ్రద్ధతో ఆచరించుట గమనించదగియున్నది. దోమలను నివారించుటకై "టార్టాయిస్ కాయిల్" (Tortoic Coil) కాల్చుట ఈనాటి ప్రజానీకానికి తెలుసుగాని సుగంధ ధూపము - ఆరోగ్య సాధన - రోగ నివారక అనునది సదా జ్ఞాపకము నందుంచుకో వలసియున్నది.







# విచిత్ర వాన



మెహెరాబాద్, మెహెరాజాద్ ఊళ్ళు రెండూ కూడ కరువు కాటక ప్రాంతంలోనివే. 1979వ సం॥లో వానలురాక కరువు ఏర్పడింది. జూలై 4వ తేదీ వచ్చింది ఎండలు మాడ్చేస్తున్నాయి. నీళ్ళు లేక పశువులు అల్లల్లాడిపోతున్నాయి. పంటలు మాడిపోతున్నాయి. ప్రజలు గగ్గోలు పెడ్తున్నారు. మెహర్‌బాబా మండలిలో నొకరైన అలోబా ఈ పరిస్థితికి చాలా ఆందోళన చెందాడు. నెల్నాళ్ళ నుండి పింపల్‌గామ్ (మెహరా జాద్‌కు మైలు దూరంలో నున్న పల్లె) ప్రజల నందరిని సేకరించి ప్రార్థన జరిపించాలని ప్రయత్నిస్తున్నాడుగాని వీలుపడలేదు. ఇప్పుడు పట్టుబట్టి అందరిని గుమిగూడ్చి ప్రార్థన చేయించాలనుకుని, జూలై 21వ తేది పింపల్‌గామ్‌కు వెళ్ళి, అక్కడ బడిలో హెడ్ మాష్టర్‌ను కలిసి సామూహిక ప్రార్థన చేద్దామని పిల్లలందరు అందులో పాల్గొనవలసిందని అడిగాడు. చిన్న పిల్లలకు అమాయకత్వం, విశ్వాసం, దృఢంగా వుంటాయని, అందువల్ల ముఖ్యంగా ఈ ప్రార్థనలో పిల్లలు పాల్గొనాలని అడిగాడు. అలాగే తీసికొస్తాను పిల్లలనందరినీ అని చెప్పాడు. జూలై 22వ తేది సాయంత్రం 4 గం॥లకు ఏకాంతవాస కొండ మీద ప్రార్థన జరిగేటట్లు నిర్ణయించుకున్నారు.

ఆ ఆదివారం తెల్లవారు ఝామున 2 గం॥లకు అలోబా లేచి మండలి హాలులోనికి వెళ్ళి మెహెర్‌బాబాను ప్రార్థించాడు. ఆ తర్వాత ఆ చీకటిలోనే ఒక లాంతరు చేతబట్టుకొని, ధైర్యంగా ఎగుడుదిగుడుగా ఉన్న ఆ ఏకాంతవాస కొండ ఎక్కి అక్కడ ప్రార్థన చేసి తిరిగి వచ్చాడు. 7 గం॥లకు పింపల్‌గామ్ గ్రామంలోకి వెళ్ళి అన్ని సందులు తిరిగి, అందరినీ సామూహిక ప్రార్థనలో అందరూ పాల్గొనవలసిందని కోరాడు.

సాయంత్రం 3-30 గంటలకు సుమారు 20 మంది పాశ్చాత్య ప్రేమికులతో కలిసి అలోబా కొండ ఎక్కాడు. భగవంతుడైన మెహర్‌బాబాకు చిన్న మందిరం ఏర్పాటు చేసి మెహర్‌బాబా ఫోటో ఒక కుర్చీలోపెట్టి అలంకరించారు. అంతలో దూరం నుండి తాళాలు, తప్పెటలు వినవచ్చినాయి. చాల మంది జనం "అవతార్ మెహర్‌బాబాకి జై" అంటూ నినాదాలు చేస్తూ వస్తున్నారు. వారందరు చిన్న చిన్న పిల్లలు, వారిని నడుపుకుంటూ వారి

టీచర్లు, ఇంకొంత మంది పెద్దలు వచ్చారు. 320 మంది పిల్లలు ప్రవాహంలాగా వస్తూ కనబడ్డారు. ఇంత మందికి చోటు ఇక్కడ ఉంటుందా అనే సమస్య కల్గింది. కాని పిల్లలంతా క్రమశిక్షణగా ఆడ పిల్లలంతా ముందు వరుసలలోను, మగ పిల్లలంతా వెనుక వరుసలలోను యిరుక్కొని కూర్చున్నారు. అంత ఇరుకుగా ఉన్నా అంతా నిశ్శబ్దంగా కూర్చున్నారు.

అలోబా ముందుకు వచ్చి మెహర్‌బాబా పటానికి పూలమాల వేసి కొబ్బరి కాయ కొట్టాడు. తర్వాత మరాఠా భాషలో "మెహర్‌బాబా అవతార పురుషుడు", రామునకు, కృష్ణునకు, మెహర్‌బాబాకు తేడా లేదు. ఆయన దయామయుడు, కరుణా సముద్రుడు, హృదయాంతరాళలో నుండి వచ్చే ప్రార్థనలను ఆయన తప్పక అలకిస్తారు. నెరవేరుస్తారు. కనుక మనమంత హృదయ పూర్వకంగా ఆయనను ప్రార్థిద్దాం. మనకు తప్పక వానలు కురుస్తాయి. అంటూ ధృడమైన విశ్వాసంతో మాట్లాడాడు. ఆ మాటలు అందరిలో భక్తిభావం పెంపొందించినవి. అప్పుడు టీచరోకరు పర్‌వర్‌దిగార్ ప్రార్థన చదువుతుంటే పిల్లలంతా భక్తి నమ్రతలతో కళ్ళు మూసుకొని భగవం[illegible]తెన మెహర్‌బాబాను తలుచుకుంటూ కూర్చున్నారు. ఆ ప్రదేశమే పునీతమైనట్లు కన్పించింది. ఆ వాతావర్ణమే మారిపోయింది. ఆ టీచర్ వాన ప్రార్థన ఒకటి చదువుతుంటే, ఆ ప్రార్థన తెలిసిన పిల్లలంతా అందులో భక్తితో పాల్గొన్నారు. వారి ప్రార్థనలో ఆర్థింపు, భగవంతుడు తమ ప్రార్థన ఆలకిస్తున్నాడనే విశ్వాసము, నిజాయితి కన్పించినాయి. ప్రార్థనంతరము అందరూ ఒక్కొక్కరే వచ్చి మెహర్‌బాబా ఫోటోకు నమస్కరించి ప్రసాదం తీసుకుంటున్నారు. కొద్ది మంది పిల్లలా విధంగా దర్శనం చేసుకున్నారో లేదో, వాన చినుకులు ప్రారంభమయినవి. అందరూ ఆనందాతిశయంతో "అవతార్ మెహర్‌బాబాకి జై" అంటూ దిక్కులు పిక్కటిల్లెటట్లు నినాదాలు చేశారు.

అప్పుడు అలోబా "చూశారా ! పిల్లలూ ! మీ ప్రార్థన నేను విన్నాను సుమా ? అని మెహెర్‌బాబా తెల్పడానికి ఈ చిన్న చిన్న చినుకులు కురిపించాడు. తర్వాత మనందరికి కావలసినంత పెద్ద వాన వస్తుంది" అన్నాడు.

అదే విధంగా ఈ ప్రార్థన జరిగిన 35 గం॥ల తర్వాత అహ్మద్‌నగరంలో ఉరుములు మెరుపులతో కూడిన వాన కురిసింది. ఆనందంతో ప్రజలంతా నృత్యాలు చేశారు. ఏనాడో తప్పిపోయిన బిడ్డను ఒడిలోకి తీసుకొన్నట్లు భూదేవి, ఈ వాన నాలింగనం చేసికొంది. ఆ క్షణం ఆ ప్రజలందరికీ ఎంతో

ఆనందదాయకమైంది.

ఆ విధంగా వాన తెల్లవార్లూ కురుస్తూనే వుంది. వాతావరణ నిపుణులు ఈ వాన ఏ ఋతుపవనానికి సంబంధించిందో తెలుసుకోలేక పోయారు. అనుభవజ్ఞులయిన ఊరి పెద్దలు కూడ ఈ వాన ఏ దిక్కు నుండి వస్తున్నది కనుక్కోలేక పోయారు. పత్రికలన్నీ ఈ వార్తను విచిత్రంగా ప్రకటించినవి. జూలై 25వ తేది ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో అహ్మద్‌నగర్ ప్రాంతంలో "విచిత్రవాన" అంటూ ప్రకటించింది. ఈ వర్షం వల్ల అహ్మద్‌నగర్ ప్రజలంతా కరువు కాటకాల నుండి రక్షించబడ్డారు. కానీ వాతావరణ నిపుణులు కాగితాలు, పటాలు పెట్టుకొని ఈ వాన ఎక్కడ నుండి వచ్చింది. ఎలా వచ్చింది అంటూ తలలు బద్దలుకొట్టుకున్నారు. ఆ వాన ఎక్కడ నుండి వచ్చిందో భగవంతునికి మాత్రం తెలుసు. ఆ వాన ఎవ్వరు పంపించారో మనకి మాత్రం తెలుసు. కనుక శ్రద్ధా, భక్తి, విశ్వాసాలతో సద్గురుని సేవిస్తే ఏ విధమైన ఆటంకాలనైనా అవలీలగా దాటవచ్చు.

## మాండూక్యోపనిషత్తు

(1) ఓ మిత్యేత దక్షరమిదగ్ం సర్వం, తస్యోపవ్యా
ఖ్యానం, భూతం భవద్భవిష్యదితి సర్వమోంకారేవ ।
యచ్చాన్యత్ త్రికాలాతీతంతద ప్యోంకార ఏవ

ఈ దృశ్య జగత్తు అంతా కూడా ఓంకారమే. ఇంకా వివరించాలంటే భూత భవిష్యద్వర్తమాన కాలాలలో ఉన్నదంతా కూడ ఓంకారమే. ఈ మూడింటినీ అతిక్రమించినదే దైనా ఉంటే అది కూడా ఓంకారమే.

(2) సర్వం హ్యేతాద్ బ్రహ్మ అయమాత్మా
బ్రహ్మసోఽ మమాత్మా చతుష్పాత్ ।

నిజంగా సర్వమూ బ్రహ్మయే, లోనున్న ఈ ఆత్మా బ్రహ్మమే, ఆత్మాకు, పాదాలు నాలుగు.

(3) జాగరితస్థానో బహిః ప్రజ్ఞః సప్తాంగ కోనవిం శతి ।
ముఖః స్థూలభుగ్ వైశ్వానరః ప్రధమః పాదః ॥

వైశ్వానరుడు మొదటి పాదం, విశ్వంలోని నరులందరి లక్షణమైన

స్థూలశరీరస్థితికి ఇతడు ప్రతినిధి. జాగ్రదవస్థ ఇతనికి సంచార స్థానం. బాహ్య విషయాలను మాత్రమే ఇతడు గ్రహిస్తాడు. ఏడు అవయవాలు పందొమ్మిది నోళ్ళు గల ఇతడు స్థూల విషయాలను అనుభవిస్తాడు.

(4) స్వప్న స్థానోఽంతః ప్రజ్ఞః సప్తాంగ ఏకోనవింశతి ।
ముఖః ప్రవివిక్త భుక్ తైజసో ద్వితీయః పాదః ॥

రెండవది తైజసుడు (తేజవంతుడు లేక మానసిక స్థితి) ఇతనికి స్వప్నావస్థ సంచారస్థానం. కలలో చూచే విషయాలనే గ్రహించగలడు కనుక అంతర్ముఖమైన చేతన కలవాడు. ఏడు అవయవాలూ పందొమ్మిది నోళ్లూ కలిగి ఇతడు సూక్ష్మ విషయాలను, అనుభవిస్తాడు.

(5) యత్ర సుప్తోన కంచనకామం కామయతే ।
న కంచన స్వప్నం పశ్యతి, తత్ సుషుప్తం ॥
సుషుప్త స్థాన ఏకీభూతః ప్రజ్ఞాన ఘన ఏవా నందమయో ।
హ్యానందభుక్ చేతో ముఖః ప్రాజ్ఞ స్తృతీయః పాదః ॥

నిద్రించినపుడు ఏ కోరికలూ, కలలూ లేని స్థితి సుషుప్తి, గాఢనిద్ర, ప్రాజ్ఞుడు (గాహక లేక బౌద్ధిక స్థితి) సుషుప్తిని సంచార స్థానంగా కలిగి ఉంటాడు. అన్ని అనుభవాలూ అతనికి ఏకమైపోతాయి. చేతన లేక గ్రహణశక్తి అస్పష్టంగా నిలిచిపోతుంది. ఆనందమయుడై ఆనందాన్ని అనుభవిస్తూ అతడు స్పష్టమైన గ్రహణాలకు ద్వారంగా ఉంటాడు.

(6) ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోఽంత ర్యామ్యేష ।
యోనిః సర్వస్య ప్రభవాప్యయౌహి భూతానామ్ ॥

ఇదే అన్నిటికీ ప్రభువు - వాటి జ్ఞాతా, అంతర్యామి, నియామకుడూ, కారణ, ఉత్పత్తి, వినాశము అన్నీ ఇదే.

(7) సాంతః ప్రజ్ఞం న బహిః ప్రజ్ఞాం నో భయతః
ప్రజ్ఞం నప్రజ్ఞాన ఘనం నా ప్రజ్ఞం । అదృష్టమవ్యవ
హార్యమగ్రాహ్య మలక్షణ మచింత్య మవ్య
పదేశ్య మేకాత్మ ప్రత్యయసారం ప్రపంచోపశమం
శాంతం శివమద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా సవిజ్ఞేయం ॥

ఈ నాలుగువది అంతరమైన చేతనకాదు. బాహిరమైన చేతన కాదు. రెండూ చేరిన చేతన కాదు. అస్పష్టమైన చేతన మాత్రం కాదు, సమిష్టి చేతన కాదు. అచేతన కూడా కాదు. అది కనిపించదు. ఇంకొక దానితో సంబంధం పెట్టి చెప్పడానికి లేదు. దానిని మనస్సు గ్రహించలేదు. ఊహించశక్యం

కాదు. గుర్తులు చెప్పి నిర్ణయించడానికి సాధ్యపడదు. వర్ణించడానికి వీలులేదు. జాగ్రత్ స్వప్న సుషుప్తులు మూడింటికీ సామాన్యమైన ఒకే ఆత్మ తత్త్వపుసారం అది. అన్ని అన్ని వికారాలు అందులో ఆగిపోతాయి. అదే శాంతం, శివం అద్వైత్వతం అదే ఆత్మ తెలుసుకోవలసింది అదే.

(8) సోఽయ మాత్మాధ్యక్షర యోంకారోఽధియాత్రం పాదా ।
మాత్రా మాత్రాశ్చ పాదా అకార ఉకారో మకార ఇతి ॥

ఆత్మ ఓం అన్నది ఒక శబ్దంగా చెప్పినపుడు. దానితో తాదాత్మ్యం చెప్పుకోవాలి. అది భాగాలతో ఏర్పడినదిగా చెప్పినపుడు ఆత్మ యొక్క పాదాలు ఈ భాగాలతో, ఈ భాగాలు పాదాలతో ఒకటిగా చెప్పుకోవాలి. ఓం భాగాలు అ, ఉ, మ అనేవి.

(9) జాగరితస్థాగో వైశ్వానరోఽకారః ప్రథమామాఆత్రా
ఆప్తేరాది మత్వాద్ వా। అప్నోతి హవైసర్వాన్ కా
మానా దిశ్చ భవతి య ఏవం వేద ॥

జాగ్రదవస్థ సంచార స్థానంగా గల వైశ్యానరుడు ఓంకారంలో మొదటి అంశమైన ఆకారం. ఎంచేతనంటే రెండూ అంతటా వ్యాపించి ఉండేవే, రెండూ ఆది అన్నవే. ఇది తెలుసుకొన్నవాడు కోరినవన్ని పొందగలడు, అందరిలో మొదటివాడు కూడా అవుతాడు.

(10) స్వప్నస్థానః తైజస ఉకారో ద్వితీయా మాత్రా,
ఉత్కర్షా దుభయత్వాద్వా, ఉత్కర్షతి హవై జ్ఞాన
సంతతిం సమానశ్చ భవతి, నాస్యాబ్రహ్మవిత్
కులే భవతి య ఏవం వేద ॥

స్వప్నావస్థ సంచారస్థానంగా గల తైజసుడు ఓంకారంలో రెండవ అంశమైన ఉకారం, ఎంచేతనంటే అవి రెండూ శ్రేష్ఠమైనవీ మధ్యలో ఉన్నవీ కనుక, దీనిని తెలుసుకొన్నవాని జ్ఞానం వర్ధిల్లుతుంది. అందరికీ అతడు సమానుడవుతాడు. బ్రహ్మవిదుడు కానివాడు అతని వంశంలో జన్మించడు.

(11) సుషుప్తస్థానః ప్రాజ్ఞో మకారస్తృతీయా
మాత్రా, మితేరపీతేర్వా, మినోతి హవా ఇదం
సర్వమపీతిశ్చ భవతి య ఏవం వేద ॥

గాఢనిద్ర సంచార స్థానంగా గల ప్రాజ్ఞుడు ఓంకారంలోమూడవ భాగమైన మకారం. ఎలాగంటే అవి రెండూ కూడా మిగతా వాటిని కొలత

చూస్తాయి. వాటిని తామలో లీనం చేసుకుంటాయి. ఇది తెలుసుకున్నవాడు. తన జ్ఞానంతో అన్నింటినీ కొలత చూడ గలడు. అన్నింటినీ తనలో లీనం చేసుకోగలడు.

(12) అమాత్రశ్చతుర్థోఽవ్యవహార్యః ప్రపంచో
పశమః శివోఽద్వైత ఏవమోంకార
అంత్మైవ సంవిశత్యాత్మ నాత్మానం
య ఏవం వేద య ఏవం వేద ॥

అంశాలు లేని (శబ్దరహితమైన) ఓంకారమే, తురీయం, నాలుగువది. అది సర్వాతీత నిరష్కరమైన సత్త పరమానందం అద్వైతం. ఇలా ఓంకారమే ఆత్మ. దీనిని తెలుసుకున్నవాడు తన ఆత్మను పరమ ఆత్మలో లీనం చేసుకుంటాడు.

## అనుగ్రహ నగర్ ప్రవేశమహోత్సవం

ది. 14-2-99 మహాశివ రాత్రి పర్వదినమున పూజ్య గురుదేవులు శ్రీ శ్రీరామకృష్ణగారు లాంచనంగా అనుగ్రహనగర్ ప్రవేశ మహోత్సవం జరిపించారు. దాదాపు ఆంధ్ర ప్రదేశ్‌లోని అన్ని శాఖల నుంచి వచ్చిన మన సోదర కార్యకర్తలతో పూర్ణానందమయను వాతావరణంలో జరిగిన ఈ కార్యక్రమము ప్రపంచ చరిత్రలో ఓ అద్భుత ఘటనగా మిగిలిపోతుంది. ఈ సందర్భముగా సాయంత్రం 4 గం॥లకు మేదరమెట్ల సిద్ధిరాజు పీఠం నుండి డా॥ మన్నే హనుమంతరావుగారి ఆధ్వర్యములో 'శోభాయాత్ర' (అన్ని శాఖల కార్యకర్తలతో) మేదరమెట్ల పురవీధులలో జరిగినతీరు అద్భుతం. జనావళికి ఒక క్రొత్త ఉత్సాహాన్ని అందించి సత్యయుగ వాతావరణం సృష్టించింది.

తదనంతరము రాత్రి గం. 8-00 లకు ప్రారంభించి జరుపబడిన 'మహాకాల యజ్ఞం' సుసంపన్నమైనది. ఆర్. కె. సందేశానంతరం యజ్ఞ కార్యక్రమాన్ని వివిధ ఆశ్రమాల కార్యకర్తలు నిర్వహించిన తీరు ఆకట్టుకుంది. యజ్ఞానికి ముందు మేదరమెట్ల చిన్నారి పాపలు చేసిన నృత్య రీతులు అందరిని అలరించాయి.

ఈ కార్యక్రమానికి ప్రత్యక్షంగా, పరోక్షంగా సహకరించిన మేదరమెట్ల, ఎర్రబాలెం, అద్దంకి ఇంకా అనేక గ్రామాల మిత్రులందరికి కృతజ్ఞతాంజలులు.




ఈ పత్రిక సంవత్సర చందా : 36/-    జీవిత చందా : రూ. 450/-లు

BOOK-POST

PRINTED MATTER

TO

Printed and Published by Smarthugami Publications (PVT) Limited., Guntur. Editor : 1. Vijaya Bhaskar Reddy, Cross Roads, Santhamagulur, (P.O. & Mandal) Prakasam Dt., Pin : 523 302. ☎ 63206 (08647)

SAI LAKSHMI OFFSET PRINTERS, Lalapet, GUNTUR - 3. ☎ 223399